# ఆంధ్రప్రదేశ్ సైన్సు అకాడమి - హైదరాబాదు

## ఆశయములు, లక్ష్యములు

అధ్యక్షులు

**పి వి జి రాజు**

ఉపాధ్యక్షులు
**డాక్టరు సూరి భగవంతం**

గౌరవకార్యదర్శి
**డాక్టరు సక్సేనా**

ప్రచురణముల సంపాదకుడు
**డాక్టరు డి వి సుబ్బారెడ్డి**



1 విజ్ఞానశాస్త్ర, శాస్త్ర విజ్ఞానమును అభివృద్ధిచేయుట.

2 శాస్త్ర విజ్ఞానమును విద్యావంతులలో, సామాన్య ప్రజలలో వ్యాపింపజేయుట.

3 శాస్త్రవేత్తలకేగాక, సాధారణ పాఠకులకు ఉపయోగపడు వైజ్ఞానిక పుస్తక భాండాగారములు, వైజ్ఞానిక పత్రికా పఠన శాలలు ఏర్పరుచుట.

4 వైజ్ఞానిక చిత్రములు, రహస్యముల సమాచారములు, ఆకర్షణీయములగు చిత్రములు, నమూనాలు (మాడల్సు) తయారు చేయించి వస్తు ప్రదర్శనశాల ఏర్పరుచుట.

5 సామాన్య పౌరులకు ఉపయోగపడునట్టి శాస్త్ర గ్రంథములను తెనిగించి, సులభశైలిలో ప్రచురించుట.

6 విజ్ఞాన శాస్త్రములకు, కళాసాహిత్యములకు అనుసంధానము కుదుర్చుట.

7 విజ్ఞాన శాస్త్ర వికాసమునకు, ప్రసారమునకు, పరిశోధనలకు మూలధనము, విరాళములు సంపాదించి, భద్రపరచుట, సద్వినియోగము చేయుట.

# శాస్త్రీయ వాఙ్మయ సూచిక

[1863 — 1965]


సంగ్రాహకుడు

వెలగా వెంకటప్పయ్య






ఆంధ్ర ప్రదేశ్ సైన్సు అకాడమి

హైదరాబాదు

# BIBLIOGRAPHY OF SCIENCES IN TELUGU
## 1863—1965
## Volume I : Printed Books

Compiled by
Velaga Venkatappaiah

March 1967
Price : Rs 5-00


Published by
Andhra Pradesh Akademi of Sciences
Osmania University Campus
Hyderabad — 7

Printed at
Sarvodaya Press, Vijayawada-6

# సంపాదకీయ భూమిక

అరువది యేండ్లనాడే ఆంధ్రమండలమున విజ్ఞానచంద్రికలు వెలుగసాగినవి. ఇరువది యేండ్లుగా ఆంధ్రదేశమున తెలుగు భాషా సమితి. ప్రభుత్వము తరపున, పారితోషికముల ఏర్పాటుచేసి, విజ్ఞానశాస్త్ర గ్రంథ రచనకు ప్రోత్సాహమొసగు చుండెను. ఈ ప్రణాళికవలన కొంతమంది గ్రంథకర్తలు, కొన్ని గ్రంథముల రచించి పోటీలలో పాల్గొనుటకు ప్రేరేపింపబడిరి. మరికొందరు రచయితలు పేరు, ప్రశస్తిగాంచిరి. ఈమధ్య హైదరాబాదులో స్థాపింపబడిన తెలుగు ఉర్దూ అకాడమీ వారును కొన్ని శాస్త్ర గ్రంథములను వ్రాయించి ప్రచురించుచున్నారు. కాని, మన ఆంధ్ర ప్రదేశ్ యొక్క విస్తీర్ణతకు, మన జనాభాకు విద్యావంతుల సంఖ్యకు, తగినన్ని శాస్త్ర గ్రంథములు ప్రకటింపబడుటలేదు. ఆంధ్ర ప్రదేశమున, సామాన్య జనులలో అక్షరజ్ఞులలో విద్యాధికులలో సమాజ సాంఘిక ఆధునిక విజ్ఞానము, మేలు జీవనములో ప్రతి వ్యక్తి జీవన దృక్పథములో, జ్ఞాన సేకరణలో వృత్తి నిర్వహణములో తగినంత పరిణామముల కలిగించినదా ? మన గ్రంథాలయములలో విజ్ఞాన గ్రంథముల సంఖ్య చాలతక్కువ. విజ్ఞానశాస్త్ర పాఠముల బోధించు అధ్యాపకులు చదువుకొనుటకుకూడ తగినన్ని ఉత్తమ రకముల పుస్తకములు దొరుకుటలేదు.

ఆంధ్రప్రదేశ మేర్పడిన తర్వాత ఆంధ్రుల సర్వతోముఖ అభ్యుదయమును, సంస్కృతిని పెంపొందించుట ప్రత్యేకముగ "సైన్సు అకాడమి" అను నొక నూతనసంస్థ మన రాష్ట్రమున, ప్రభుత్వ ప్రోద్బలముతో ఏర్పడుట, ఎంతో సంతోషదాయకము.

సైన్సు అకాడమి, తన ఆశయములను కార్యరూపమున సాధించుటకు, ఉప సంఘముల ఏర్పరచెను. ప్రచురణ సంఘమునకు సంపాదకులుగా డాక్టరు రేవాడ సత్యనారాయణగారిని ఎన్నుకొని యుండిరి. ఉప సంఘములో నేనును ఒక సభ్యునిగా యుంటిని. ఎట్టి ప్రచురణలు చేయవలెను ? పండితులచేత క్రొత్త గ్రంథములు వ్రాయించవలెనా ? ఇంగ్లీషులో సుప్రసిద్ధమైన గ్రంథముల భాషాంతరీకరణము చేయుట చాలునా? ఆ గ్రంథములు ఎవరికి ఉపయోగ పడవలయును? విద్యాధికులకా, విజ్ఞానశాస్త్ర పండితులకా, విద్యార్థులకా, శాస్త్రవిజ్ఞానములో పరిచయము లేని విద్యాధికులకా ? మనదేశమున దొరుకు ఇంగ్లీషు గ్రంథముల చదువుటకు శక్తిలేని వారలకా? అక్షరజ్ఞులగు జన సామాన్యమునకా ? ఇట్టి ప్రశ్న లనేకములు ఆలోచింపవలసి వచ్చెను.

అకాడమీ సభ్యులు ఇంగ్లీషు గ్రంథముల కొన్ని తెనిగించుటకు సూచన లిచ్చిరి. అందులో కొన్ని ముందు ప్రచురింప తీర్మానింపబడెను. వీటి రచయితల, లేదా ప్రచురణ కర్తలయొక్క అనుమతి, మొదట కావలసి యుండెను. ఈ గ్రంథములు తెనిగించుటకుతగిన శాస్త్ర పరిజ్ఞాన ముతోకూడ భాషా పాండిత్యము, పారిభాషిక పరిచయముకల రచయితల వెతకి నిర్దేశింపుట అవసరమయ్యెను. అటుపైన అనువాదము యొక్క భాష, శైలిని సరిచూచుటకు ఒక పండితుని నియమించిరి.

ఆంధ్రీకరణము చేయ తీర్మానించుకొన్న గ్రంథములలో రెండు అచ్చునకు తయారుగ నున్నవి. మరి రెండు భాష, శైలి విషయమై పర్య వేక్షణలో నున్నవి. మరొనాలుగు అనువాదకులవద్దనుండి ఇంకనురాలేదు.

ఇవి ఇట్లుండగా, అకాడమి ప్రోత్సహించిన సంగ్రాహకగ్రంథము "సూచిక" తయారయి, అచ్చు అయి, పుస్తకరూపమున వెలువడుట సంభవించినది.

ఇంతలో అకాడమిలోకూడ ఎన్నికలు జరిగినవి. డాక్టరు రేవాడ సత్యనారాయణగారు అకాడమి ప్రచురణముల సంపాదకత్వమును విర మించుకొనిరి. ఆ స్థానమునకు నన్ను ఎన్నుకొనుటవలన, ఈ భూమిక వ్రాయు గౌరవము, నాకు లభించినది. అకాడమి కల్పతరువు ఈ సంవత్సరపు కాపులోని మొదటి ఫలము ఇది. ఆంధ్రభూమి సహజ స్వభావమున, కొంతచేదు, కొంత వగరు, కటుత్వము ఉండినను, విజ్ఞానదాయకము ఆరోగ్య ప్రదముగ నుండునని మా ఆశాభావము.

ఇట్టి విజ్ఞాన పుష్పములు, ఫలములు అనేకములు ఆంధ్ర భాషలో వెలువడి, అఖిల భారతదేశ శాస్త్ర వాఙ్మయ భారతికి, అలంకారములుగ పోషణకరములుగ ప్రజాభిమానమును గడించుగాక.

దండా వెంకట సుబ్బారెడ్డి
సైన్సు అకాడమి ప్రచురణముల సంపాదకుడు

ప్లవంగనామ సంవత్సరాది
10-4-1967

# గ్రంథావతారిక

ఆంధ్ర గ్రంథ సూచికలు ఇంతకుముందు తెలుగుభాషలో కొన్ని వెలువడినవి. మాకు తెలిసిన వానిలో ముఖ్యములు అనుబంధమున పేర్కొనబడి యున్నవి. వీనియందు విజ్ఞానశాస్త్ర గ్రంథముల ప్రసక్తి, సంఖ్య చాల కొద్దిపాటి.

ఏ యే పుస్తకములు వ్రాయబడినవో తెలుసుకొనుటకు తగిన పాత కేటలాగులుకూడ దొరకుటలేదు. మొదట తెలుగులో విజ్ఞానశాస్త్ర గ్రంథములను వ్రాసినవారుగాని, అచ్చువేసినవారుగాని, ఆ రచనలకు తగినంత ప్రచారము ఇవ్వలేకపోయిరి. అచ్చు అయిన గ్రంథములు చాలవరకు జీర్ణమైపోయినవి. పుస్తకము పేరు దొరికినను, పుస్తకము చూచుట మహాకష్టముగనున్నది.

తెలుగుభాషలో విజ్ఞానశాస్త్ర గ్రంథములు ఎప్పుడు వెలువడినవి? ఏ యే విజ్ఞాన విభాగములకు మొదట ప్రాముఖ్యత లభించినది? ఆ గ్రంథములు ఆంధ్రీకరణములా, స్వతంత్రరచనలా? మనదేశ కాలపాత్రలలో, విద్యా విధానములలో, సాంఘిక, ఆర్థిక పరిస్థితులలో మార్పుల కొలది, విజ్ఞానశాస్త్ర గ్రంథ రచనలు ప్రచురణములు, మారి శాస్త్ర విజ్ఞానము, వికాసమును పొందినది. ఈ విషయము సమగ్రముగ తెలియవలయునన్న ప్రతి భాషలో శాస్త్రీయ వాఙ్మయ సూచిక వాంఛనీయము, అత్యవసరముకూడ.

ఈ వాఙ్మయ సూచిక అవసరమేమి? దాని ప్రయోజనమేమి? అని ప్రశ్నలు వేయువారు ఉండుట సహజమే. మన ఆంధ్రప్రదేశమున మొదట ఎవరు ఎట్టి శాస్త్ర గ్రంథములు వ్రాసిరి? కాలక్రమమున ఎట్టి విజ్ఞాన గ్రంథావళి ప్రచురింపబడెను? ఎట్టి గ్రంథములు ఏ శాస్త్రమునకు సంబంధించినవి తెనిగింప అవసరమయ్యెను? ఏ శాస్త్రములలో స్వంత రచనలు ప్రారంభమయ్యెను? ఇట్టి సమీక్ష తెలుగువారైన విజ్ఞాన విశారదులకేకాక, వాఙ్మయ కోవిదులకు, ఆంధ్ర సంస్కృతి యందభిలాషగల ప్రతిస్త్రీ పురుషులకు మనోవికాసము కలిగించును.

ఇక విజ్ఞాన శాస్త్ర అధ్యాపకులకేమి, గ్రంథాలయ అధికారులకేమి, పండిత పరిషత్తులకు, విశ్వవిద్యాలయములకు ఇట్టివాఙ్మయ సూచికలు చాల

ఉపయోగముగా ఉండును. ప్రభుత్వముగాని, సైన్స్ అకాడమి గాని, విజ్ఞానశాస్త్ర గ్రంథముల ప్రచురించుటకు పథకములు, ప్రణాళికలు ఏర్ప రచుటకును, ప్రస్తుతము విజ్ఞాన వాఙ్మయమున కనుపించు వివిధ లోపము లను గుర్తించి తొలగించుటకును ముందుకాలమున ఏ యే అంతస్తులలో, ఏ యే శాస్త్ర విభాగములకు సంబంధించిన ప్రమాణ గ్రంథములు, స్కూ ళ్ళలో పఠన గ్రంథములు, సామాన్య చదువరులకు అర్థమగు ప్రాథమిక సులభ శైలి గ్రంథములు, కావలయునో నిర్ణయించుటకు, రచనల ప్రోత్స హించుటకు ఇట్టి సూచికలు చాల తోడ్పడును.

ఇట్టి సూచికల ఆవశ్యకతను నేను ముప్పది సంవత్సరముల క్రిందట గుర్తించి, అట్టి పట్టికను (సూచికను) తయారు చేయుటకు కొన్ని ప్రయత్నములు, కొంత కాలము చేసియుంటిని. ఆంధ్రప్రదేశ మందలి గ్రంథాలయముల సూచీలను, పుస్తకములను మాత్రమేగాక మద్రాసులోని ప్రచురణములను, జాబితాలను మరియు గ్రంథాలయములు, గ్రంథములు అందుబాటులో ఉన్నంతవరకు శోధించి పరీక్షించియుంటిని. కాని ఇంకను ఎంతోకాలము, ఎన్నో జనపదముల వెతకి విచారణ చేయ వలసిన ఆవశ్యకతను స్మరించి అంతటితో నా ప్రయత్నమును విరమించు కొంటిని. మూడు దశాబ్దముల తర్వాత మరల అట్టి ఉద్దేశము కలిగిన శ్రీ వెలగా వెంకటప్పయ్యగారు అట్టిప్రయత్నమును మరల ప్రారంభించి, సఫలీకృతులైనారు. అందుకు వారికి నా అభివందనములు.

వారి ప్రయాణములలో అన్వేషణలో దొరుకని విషయములు, గ్రంథనామములు, రచయితల వివరములు పెక్కులుండునని మాకు తెలియును. అట్టి గ్రంథములుకాని, వాటి రచయితలయొక్కయు, ప్రచురణాధికారులయొక్కయు, ముద్రింపబడిన సంవత్సరము, మొదలైన వివరములు తెలిసినవారు, వానిని అకాడమికి అందజేసిన, కృతజ్ఞతతో స్వీకరించి, ముందు ప్రచురణములలో చేర్చెదము.

దండా వెంకట సుబ్బారెడ్డి

ప్లవంగనామ సంవత్సరాది :

10-4-1967

# గ్రంథపరిచయం

తెలుగు సాహిత్య మాగాణంలో రచనా వ్యాసాంగం ప్రారంభ మయిననాడే గ్రంథ రచనకు నాంది జరిగినట్లుగానే. తెలుగు భాషలో పుస్తకాల ముద్రణ ప్రారంభమయిన తొలి రోజులలోనే కొన్ని శాస్త్రీయ గ్రంథాలు అచ్చు ముచ్చటలు సంతరించుకొన్నవి. వాటిలో తొలి తిలకం పావులూరి మల్లన గణిత శాస్త్రానికి దక్కింది. మల్లన రాజరాజ నరేంద్రుని ఆస్థానాన్ని అలంకరించిన మహాకవి. నన్నయకు సమకాలికుడు. మల్లన గణితాన్ని 1861వ సంవత్సరంలో తడకమళ్ళ వెంకటకృష్ణారావు గారు పద్యరూపంలోకి పరివర్తించారు. దానిని 1863 వ సంవత్సరంలో వావిళ్ళ వారు ప్రచురించారు. ప్రస్తుతం లభిస్తున్న సమాచారాన్ని బట్టి ఇదే తొలి శాస్త్రీయ విజ్ఞాన గ్రంథమని తేటతెల్ల మవుతుంది.

అయితే అప్పటినుంచి గ్రంథరచన విస్తృతంగా సాగలేదు. గత శతాబ్ది అంతంలో చెదురు మదురుగా, శాస్త్రీయ గ్రంథాలు ప్రచురింప బడినాయి. ఈ శతాబ్దపు తొలి భాగంలో విజ్ఞాన చంద్రికా మండలి తమకీర్తి చంద్రికలను నలుచెరగులా వెదజల్లడంతో శాస్త్రీయ వాఙ్మయ రచన శాస్త్రీయ గ్రంథాల పరనం తెలుగునాట విశేషంగా వ్యాపించింది. కానీ ఈ వెల్లువ అట్టేకాలం నిలువలేదు. మరల కొంతకాలం పాటు శాస్త్ర గ్రంథ రచనపై కారుమబ్బులు క్రమ్ముకొన్నాయి.

దేశానికి స్వాతంత్ర్యోదయం కాగానే యీ మబ్బుతెరలు విచ్చుకున్నాయి. నవతేజ కాంతి కళికలు విజ్ఞాన శాస్త్రంపై వెలుగును ప్రసాదించాయి. ప్రాంతీయభాషలో పుస్తకాల ప్రచురణ ఉవ్వెత్తుగా ప్రారంభం కాసాగింది. సామాన్య పాఠకుని మొదలు అసాధారణ పరిశోధకుని వరకు శాస్త్రీయ వాఙ్మయంపై తీరని మక్కువ కలిగింది. తత్ఫలితంగా నిశిత శాస్త్రీయ గ్రంథాలతోబాటుగా సుగమంగా విజ్ఞాన శాస్త్రాంశాలను బోధించే

పుస్తకాలు కూడా తెలుగు నాట కుప్పలు తెప్పలుగా వెలువడటం ప్రారంభించాయి.

## గ్రంథావతరణ

ఈ తీరుగా వెలువడుతోన్న సాహిత్యంలో సమన్వయం లేదు. ప్రచారం సక్రమంగా లేదు. నూర తీరాల అవధులు లేని యీ కాలంలో ఒక ప్రాంతంలో అచ్చయిన పుస్తకాలు మరొక ప్రాంతానికి సరిగా సంచాలనం కావడం లేదు. ఏ విషయంపై ఎన్ని పుస్తకాలు ప్రచురింపబడినవో తెలిపే సూచికలుగాని, ఆ పుస్తకాలను గురించి సంగ్రహంగా తెలిపే వివరణాత్మక గ్రంథాలుకాని లేవు. శాస్త్రీయ గ్రంథాల విశేష ప్రచారానికి ఈ లోటు తీరని ప్రతిబంధకంగా ఉంటోంది. ఈ లోటును తీర్చడానికి యిది వరలో కొందరు చేసిన ప్రయత్నాలు సరిగా కార్యరూపంలోకి రాలేదు.

విజ్ఞాన శాస్త్రాభివృద్ధి నిమిత్తం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సైన్సు అకాడమీని నెలకొల్పింది. ఈ అకాడమీ శాస్త్రీయ గ్రంథాలపై వాఙ్మయ సూచికను తయారుచేసి ప్రచురించడానికి నిర్ణయించింది. ఈ పనిని ప్రస్తుతం ఉస్మానియా వైద్య కళాశాలలో వైద్యశాస్త్ర చరిత్ర విభాగమునకు ఆచార్యపీఠాన్ని అలంకరించియున్న డాక్టరు డి వి సుబ్బారెడ్డి గారి పర్యవేక్షణలో పూర్తిచేయుటకు నిశ్చయించింది. ఈతీరుగా యీ వాఙ్మయ సూచిక అవతరణకు నాంది జరిగింది.

## సమాచార సేకరణ

ఈ సూచి తయారుచేసేందుకు వీలయిన అన్ని ప్రయత్నాలు చేయడం జరిగింది. సమాచార సేకరణ నిమిత్తం ఆంధ్రావనిలోను, మద్రాసు నగరంలోను గల ప్రసిద్ధ గ్రంథాలయాలు, ప్రచురణ సంస్థలు, విశ్వవిద్యాలయాలు, కళాశాలలను సందర్శించడం జరిగింది. హైదరాబాదులోనూ, మద్రాసులోను గల పుస్తకాల రిజిస్ట్రారు కార్యాలయాలు శాసనపరంగా సేకరించిన గ్రంథాలను పరిశీలించడం జరిగింది. కలకత్తాలోని జాతీయ గ్రంథాలయంవారితో గూడ సంప్రదించడం జరిగింది. అంతేగాక ఆంధ్ర ప్రభ, ఆంధ్ర పత్రిక, ఆంధ్ర జ్యోతి, ఆంధ్ర జనత, విశా

లాంధ్ర, కృష్ణా పత్రిక, గ్రంథాలయ సర్వస్వము మొదలయిన ప్రముఖ పత్రికలలో వివరాల నిమిత్తం ప్రకటన యివ్వడంతోబాటుగా దూర తీరాలందుగల ప్రచురణ కర్తలకు, కొందరు ప్రముఖవ్యక్తులకు ఒక సర్క్యులరు పంపడం జరిగింది. ఈ తరగతి పుస్తకాలను ప్రోదిచేయు వ్యక్తులను ఈ విజ్ఞానంపై అభిరుచిగల పండితులను, పరిశోధకులను పలువురిని కలుసుకొనడం జరిగింది. ఈవిధంగా సమాచారం 1863వ సం నుండి 1965 వ సంవత్సరం వరకూ దాదాపు 1360 గ్రంథాలకు లభించింది. ఇందు ప్రధానంగా పుస్తకములు, కరపత్రములు, పత్రికలు (మొదటి సంచిక మాత్రం) చేర్చబడినది. సాధారణ పాఠ్య గ్రంథాలు, తాత్కాలిక విలువగల నోట్సులు మొదలయినవాటికి ఇందు స్థానం కల్పించలేదు. సాధ్యమయినంతవరకు వీటన్నిటిలో తాజాముద్రణలు మాత్రం చేర్చ బడినవి.

## కూర్పు

ఈ వాఙ్మయ సూచికలో పుస్తకముల తాలూకు గ్రంథకర్త, అనువాదకుడు, వ్యాఖ్యాత, గ్రంథనామము, ప్రచురణ స్థలం, ప్రచురణకర్త, ప్రచురణ తేదీ, ముద్రణ సంఖ్య, పుటలు, సైజు, మొదలయిన వివరములు లభించినంతవరకు సేకరింప బడినవి. అమరిక ఈ దిగువ పద్ధతిలో ఏర్పరుచబడినది.

1 ప్రధానంగా యీ వివరములు గల పద్దులన్నీ (ఎంట్రీస్) దశాంశ వర్గీకరణ క్రమంలో విషయములవారీగా అకారాది క్రమంలో అమర్చ బడినవి. ఉదా :

## 520 ఖగోళ శాస్త్రము

**కొండయ్య, కాశీపట్నం**

విశ్వరూపం. వాల్తేరు, విశ్వకళా పరిషత్తు, 1936. 22, 278 పు. 23.5 సెం మీ. 67

## 530 పదార్ధవిజ్ఞానశాస్త్రము

### నరసింహం, మయినంపాటి

పదార్థవిజ్ఞానశాస్త్రము. మద్రాసు. విజ్ఞానచంద్రికా మండలి. 1911. 38, 386 పు. 19 సెం మీ. 125

2 ఒక విషయంపై ఒకే రచయిత గ్రంథాలు ఒకటికన్న హెచ్చుగా ఉన్న యెడల ఆ రచయితపేరు, మరల మరల వ్రాయక మొదటి దానిని అనుసరించ బడింది. ఉదా:

## 635 కూరగాయలు

### శేషగిరిరావు, ఆంద్ర

ఆకుకూరలు. మద్రాసు, జయ నికేతనం, 1947. 104 పు. 19 సెం మీ. 1188

కూరగాయలు. మద్రాసు, జయనికేతనం, 1947. 92 పు, 19 సెం మీ. 1189

3 రచయిత పేరు లభించనట్లయితే గ్రంథనామమునే శీర్షికగా గ్రహించడం జరిగింది.

### పారిశుధ్యము

మద్రాసు, క్రైస్తవ వాఙ్మయ సమాజము, 1929. 12 పు. 14 సెం మీ.

4 రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వములు స్థానిక సంస్థలు అకాడమీలు, సంఘములు మొదలయిన సమిష్టి సంస్థలు ప్రచురించిన గ్రంథములకు ఆ గ్రంథముల రచయితల పేరులతోనే శీర్షికలను ఉంచటం జరిగింది. ఉదా :

### శంకరరెడ్డి, జి హెచ్

భూసార పరిరక్షణ. హైద్రాబాదు, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ రాజ్ పరిషత్, 1965. 2, 18 పు, 21 సెం మీ. 1137

5 గ్రంథకర్త, ప్రచురణ కర్త ఒకరే అయినయెడల ప్రచురణ కర్త పేరును పునరుక్తి చేయక ఆ స్థానంలో 'రచయిత' అని చేర్చడం జరిగింది.

వెంకటరావు, వసంతరావు

ఆధునిక విజ్ఞానం, విజయనగరం, రచయిత, 1949. 59 పు. 19 సెం మీ.

6 గ్రంథ కర్తలకు, గ్రంథ నామములకు ముందు యెడ నెడ కనుపించు గౌరవ వాచకములు, బిరుదులు మొదలయినవి యీ సూచికలో తొలగించ బడినవి.

7 పత్రికల విషయంలో సాధ్యమయినంతవరకు మొదటి సంచిక తాలూకు వివరములు చేర్చబడినవి. మొదటి సంచిక లభించక పోతే డిశెంబరు 65 సంచికగాని, లభ్యమయిన మరేదయినా సంచికగాని చేర్చబడింది.

8 ఈ గ్రంథములో వీలున్నంతవరకు విరామ చిహ్నము(ఫుల్‌స్టాప్)లను తగ్గించడం జరిగింది. ఇది చాలా ఆధునికమైన పద్ధతి ప్రసిద్ధ ప్రచురణాలయములు ప్రచురించు గ్రంథములలో యీ విధానం యిటీవల విశేషంగా అమలు పరుచబడుతున్నది.

9 పూర్తిగా లభించని సమాచారంగాని, సందేహాస్పదంగా నున్న విషయం కుండలీకరణము (బ్రాకెట్స్)లో యివ్వబడినది.

ఉదా : (1965)

అనుక్రమణికలు

చదువరి సౌకర్యం కోసం గ్రంథకర్తలకు, అనువాదకులకు, గ్రంథ నామములకు, విషయములకు అనుక్రమణిక (ఇండెక్సు)లు అనుబంధంగా ఇవ్వబడినవి. అంతేగాక ప్రచురణకర్తల పూర్తి చిరునామాల పట్టికగూడ అకారాది క్రమంలో ఇవ్వవడినది. ఇందువల్ల గ్రంథకర్త, అనువాదకుడు, గ్రంథనామము, విషయములలో ఏది గుర్తున్నప్పటికీ దాని ద్వారా ఇతర విషయాలు గ్రహించడానికి వీలున్నది. ప్రతి పద్దు అంతంలో ఇవ్వబడిన వరుస సంఖ్య యీ అనుక్రమణికలో ఇవ్వబడినది. దశాంశ

సంకేతములు కంటే యీ విధానం చదువరికి సులభమని గమనించి దీనిని ప్రయోగాత్మకంగా అమలు పరచుట యిందు జరిగినది. ఇందు విభజన ప్రధానంగా దశాంశ వర్గీకరణ ప్రాతిపదికపై చేయబడినది గనుక దశాంశ విభజనలు, చదువరి సౌకర్యార్థం గ్రంథారంభంలో యివ్వబడినవి.

## మ న వి

1965 సం. అంతం వరకు తెలుగులో అచ్చయిన శాస్త్రీయ సాహిత్యం సాధ్యమయినంతవరకు సమగ్రంగా ఇందుచేర్చటం జరిగింది. అయినప్పటికీ కొన్ని పుస్తకాలు, పత్రికలు ఇందులో చేరకపోవడానికి అవకాశం లేకపోలేదు. అంతేగాక లభించిన పుస్తకాలలో అచటచట కొన్ని వివరాలు దొరకలేదు. కనుక సహృదయులైన చదువరులు దీనిలో చేరని వివరాలను మాకు తెలియ పరచినట్లయితే ఇందు నిమిత్తం ప్రత్యేకంగా అనుబంధాన్నిగాని, మలి ముద్రణలో సవరించే అవకాశాన్ని గాని తప్పక చేయగలము.

## స హ కా ర ప్ర శం స

అంతర్జాతీయ సహకార సంవత్సరంగా గుర్తించబడిన యీ సంవత్సరంలో (1965) ప్రాంతీయ భాషలలో ఇంతటి బృహత్తర ప్రయత్నం సాగటం భారత దేశంలో యిదే ప్రథమ మనుకుంటాను. దీనికి ప్రధాన కారకులు డాక్టరు డి వి సుబ్బారెడ్డి గారనడంలో సందేహంలేదు. వారి నిరంతర తోడ్పాటు. సహకారం, ప్రోత్సాహం లేకపోతే యీ ప్రచురణ యింత సుందరంగా, ఇంత త్వరగా వెలువడే అవకాశమేలేదు. వారికి నా హృదయ పూర్వక వందనములు. అంతేగాక - సమాచార సేకరణలో విశేషంగా తోడ్పడిన గ్రంథాలయ సోదరులకు గ్రంథ కర్తలకు, ప్రచురణ కర్తలకు యీ సూచిక వర్గీకరణలో అనేక సూచనలు చేసి దీనిని మెరుగు పరచడానికి తోడ్పడిన మిత్రులు పి రాధాకృష్ణమూర్తి గారికి, వ్రాత ప్రతి తయారీలో తోడ్పడిన మిత్రులు జె జగన్మోహన్‌రెడ్డి గారికి, తదితర మిత్రులకు నా మనఃపూర్వక వందనములు.

## కృ త జ్ఞ తా భి వం ద న లు

తెలుగు భాషా సమితికి తెలుగులో ఒక శాస్త్రీయ వాఙ్మయ సూచికను తయారు చేయు నుద్దేశముతో నేను వ్రాసిన లేఖను, ప్రణాళికను

సమితి కార్యదర్శి డాక్టరు డి వి సుబ్బారెడ్డి గారు చూచి, నన్ను హైదరాబాదు రప్పించి తమ ఆశయములను, అనుభవములను నాకు తెలిపి, యీ కార్యకలాపమును ఆంధ్రప్రదేశ్ సైన్సు అకాడమీ ఆధ్వర్యమున నడిపించుట సమంజసమని అభిప్రాయమిచ్చి, నా ప్రతిపాదనను బలపరచి అకాడమీ వారికి అంపజేసిరి. వారి సలహాపైన నా ప్రణాళికను అంగీకరించి అంచలకగు వ్యయమును ఆమోదించి, నన్నీ కార్యక్రమమునకు పురికొల్పితోడ్పడిన అకాడమీ కార్యవర్గమునకు నా కృతజ్ఞతాభివందనములు.

ఇట్టి శాస్త్రీయ వాఙ్మయ సూచిలను దేశభాషలలో ప్రారంభించుటకు, కొనసాగించుటకు, అకాడమీ పూనుకొనుట, ఆంధ్ర దేశమునకు గూడ ఒక నూతన గౌరవము చేకూర్చినట్లు తలచి, ఆంధ్ర ప్రజానీకము గూడ అభివందనములు తెలుప వలసియుండును.

ఈ శాస్త్రీయ వాఙ్మయ సూచిక ఆంధ్రప్రదేశ్ సైన్సు అకాడమీ వారికి, భారతీయ శాస్త్రవిజ్ఞాన భారతికి ఒక కానుకగా, పూజా కుసుమముగా సమర్పింప గలిగిన మనము ధన్యులము.

భవదీయ

తెనాలి
పరాభవ, ఉగాది.

వెలగా వెంకటప్పయ్య
సంగ్రాహకుడు

# విషయ సూచిక

# సంజ్ఞా సూచి

| | | |
|---|---|---|
| అను | : | అనువాదకుడు |
| కం | : | కంపెని |
| చ ము | : | చతుర్థ ముద్రణ |
| చిత్ర | : | చిత్రకారుడు |
| తాత్ప | : | తాత్పర్యము |
| తృ ము | : | తృతీయ ముద్రణ |
| ద్వి ము | : | ద్వితీయ ముద్రణ |
| నా భా | : | నాలుగవ భాగము |
| పరి | : | పరిష్కర్త |
| పు | : | పుటలు |
| మూభా | : | మూడవ భాగము |
| మొ భా | : | మొదటి భాగము |
| రెం భా | : | రెండవ భాగము |
| వ్యా | : | వ్యాఖ్యాత |
| స గ్ర | : | సహగ్రంథకర్త |
| సం క | : | సంకలన కర్త |
| సంపా | : | సంపాదకుడు |
| సంపు | : | సంపుటము |
| సెం మీ | : | సెంటీ మీటర్లు |
| ( ) | : | సందిగ్ధము |

# విషయ విభజన

## దశాంశ సంకేతములు

| | |
|---|---|
| 500 | విజ్ఞాన శాస్త్రములు |
| 510 | గణిత శాస్త్రము |
| 520 | ఖగోళ శాస్త్రము |
| 520.1 | ప్రాచీన, మాధ్యమిక ఖగోళశాస్త్రము |
| 523 | వివరణాత్మక ఖగోళ శాస్త్రము |
| 523.3 | చంద్రుడు |
| 523.4 | గ్రహాలు |
| 523 6 | తోకచుక్కలు |
| 523.7 | సూర్యుడు |
| 523.8 | నక్షత్రములు |
| 525 | భూమి |
| 527 | అంతరిక్షయానము |
| 530 | భౌతికశాస్త్రము |
| 531.3 | గతిశాస్త్రము |
| 534 | ధ్వని |
| 535 | వెలుగు |
| 537 | విద్యుచ్ఛక్తి |
| 538 | అయస్కాంతశక్తి |
| 539 | ఆధునిక భౌతిక శాస్త్రము |
| 540 | రసాయన శాస్త్రము |
| 550 | భూగర్భ శాస్త్రము |

| | |
|---|---|
| 551 | భూగర్భ భౌతిక శాస్త్రము |
| 551.5 | వాతావరణము |
| 553.28 | ఆయిలు |
| 553.8 | రత్నములు |
| 570 | మానవ, జీవశాస్త్రములు |
| 572 | మానవశాస్త్రము |
| 574 | జీవశాస్త్రము |
| 575 | పరిణామము |
| 580 | వృక్షశాస్త్రము |
| 590 | జంతుశాస్త్రము |
| 600 | సాంకేతిక విజ్ఞానము |
| 610 | వైద్య శాస్త్రము |
| 610.73 | నర్సుల శిక్షణ |
| 611 | శరీర శాస్త్రము |
| 612 | మానవ శరీర ధర్మ శాస్త్రము |
| 613 | ఆరోగ్యము |
| 613.2 | ఆహారము, ఆరోగ్యము |
| 613.71 | యోగాభ్యాసములు |
| 613.943 | సంతాననిరోధము |
| 614 | ప్రజారోగ్యము |
| 614.88 | ప్రథమ చికిత్స |
| 615.1 | ద్రవ్య విజ్ఞానము |
| 615.4 | మందుల తయారి |
| 616.531 | అల్లోపతి వైద్యవిధానము |
| 615.532 | హోమియో వైద్య విధానము |

| | |
|---|---|
| 615.533 | యునాని వైద్య విధానము |
| 615.534 | ఆయుర్వేద వైద్య విధానము |
| 6.5.535 | ప్రకృతి వైద్య విధానము |
| 615 536 | సిద్ధ వైద్యవిధానము |
| 615.63 | ఇంజక్షన్ |
| 615.9 | విష చికిత్స |
| 616 | వ్యాధులు |
| 616.12 | గుండె జబ్బులు |
| 616.2 | ఊపిరి సంబంధ వ్యాధులు |
| 616.203 | ఇన్ఫ్లుయంజా |
| 616.3 | జీర్ణసంబంధ వ్యాధులు |
| 616.46 | మధు మేహము |
| 616.5 | చర్మ వ్యాధులు |
| 616.835 | పోలియో |
| 616.9 | జ్వరములు |
| 616.912 | మసూచికము |
| 616.9232 | ప్లేగు |
| 616.9272 | టైఫాయిడ్ |
| 616.9322 | కలరా |
| 616.9362 | మలేరియా |
| 616.951 | సుఖవ్యాధులు |
| 616.994 | పుండ్లు |
| 616.995 | క్షయ |
| 617 | శస్త్రచికిత్స |
| 617.6 | పంటి వైద్యము |

617.7 కంటి వైద్యము

618 స్త్రీల, బాలల, వృద్ధుల వైద్యము

618.2 ప్రసూతి విజ్ఞానము

618.92 బాలల వైద్యము

618.95 వృద్ధుల వైద్యము

620 నిర్మాణ శాస్త్రము

621.383 రేడియో

621.385 టెలిఫోన్

621.388 టెలివిజన్

622 గనులు

629.2 మోటారు

629.227 ప్రయాణ సాధనములు

630 వ్యవసాయ శాస్త్రము

631 క్షేత్రము

632 పంటలు

634 పండ్లు, తోటల పెంపకము

635 కూరగాయలు

636 పశుగణము, పెంపుడు జంతువులు

636.1 గుర్రములు

636 2 పశువులు

636.5 కోళ్ళ, బాతుల పెంపకము

636.6 పక్షులు

637 పాడి పరిశ్రమ

638.1 తేనెటీగలు

639 చేపలు

640 గృహ విజ్ఞానము
641.6 వంటలు
643 గృహ ప్రణాళిక
644 గృహ అమరిక
646 దర్జీపని
640 శిశు పోషణ
650 వ్యాపార పద్ధతులు
660 రసాయన, సాంకేతిక విజ్ఞానము
670 పరిశ్రమలు
677 నేత పరిశ్రమ
680 పరిశ్రమలు
690 వాస్తు శాస్త్రము

## సామాన్య ఉపవిభజనలు

01 తత్త్వము, సిద్ధాంతము
03 నిఘంటువులు విజ్ఞాన సర్వస్వములు
04 వ్యాసములు
05 పత్రికలు
07 అధ్యయన, అధ్యాపన
09 చరిత్ర
092 జీవిత చరిత్ర

# పుస్తక ప్రామాణిక కొలతలు

( సెంటీ మీటర్లలో )

నాలుగవ వంతు

| | |
|---|---|
| ఇంపీరియల్ | 27.5 × 38 |
| క్రౌన్ | 19 × 25 |
| డెమ్మీ | 22 × 28 |
| ఫుల్స్కాప్ | 17 × 21 |
| రాయల్ | 25 × 32 |

ఎనిమిదవ వంతు

| | |
|---|---|
| ఇంపీరియల్ | 27.5 × 19 |
| క్రౌన్ | 19 × 12.5 |
| డెమ్మీ | 22 × 14 |
| ఫుల్స్కాప్ | 17 × 10.5 |
| రాయల్ | 25 × 15.5 |

# వర్గీకృత విభాగము



ఇందు గ్రంథకర్త, గ్రంథనామము ప్రచురణాది వివరణ, పుటాది వివరణలుగల పద్దులు (Entries) విషయములవారీగా కలవు.

# 500 విజ్ఞాన శాస్త్రము

## కుటుంబరావు, కొడవటిగంటి

శాస్త్రవిజ్ఞానము. విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1963. 92పు, 19సెం మీ. 1

## చలమయ్య, ఆకురాతి

జ్ఞానజ్యోతి. కాకినాడ, శాంతి నిలయ గ్రంథమాల, 19సెం మీ. మొ భా 67పు, రెం భా 76 పు. 2

## పార్కర్, బెర్తా మారిస్

శాస్త్రజ్ఞుడివి అవుతావా ? అను : మల్లాది నరసింహశాస్త్రి. విజయవాడ, బాలానంద ప్రచురణలు, 1959. 64 పు, 21 సెం మీ. 3

## భానుమూర్తి, వేమరాజు

విజ్ఞాన దర్శిని. విజయవాడ, ఆదర్శ గ్రంథ మండలి, 1957. 545 పు, 19 సెం మీ. 4

## రాజ శేఖర్

విజ్ఞాన జగత్తు, విజయవాడ, సౌదామినీ ప్రచురణలు, 1960. 19 సెం మీ. మొ భా 56 పు, రెం భా 56 పు. 5

## రామకృష్ణశర్మ, గడియారం సంపా

విజ్ఞాన వల్లరి. వరంగల్లు, ప్రతాపరుద్ర పబ్లికేషన్స్. 115 పు, 19 సెం మీ. 6

**రామన్, సి వి**

విజ్ఞానం, విశేషాలు. అను : విస్సా అప్పారావు, విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1965. 108 పు, 21. 7 సెంమీ. నేషనల్ బుక్ ట్రస్టులు సహకారమున ప్రకటితము.

**విశ్వనాథం, భేతనభట్ల**

ఆధునిక విజ్ఞాన వికాసము. వనపర్తి, రాజారామేశ్వరరావు బహదూర్, 1951. 11, 266 పు. 21 సెం మీ. 8

**వెంకటరమణ, జి**

విజ్ఞాన లోకం. మదరాసు. 9

**వెంకటానంద రాఘవరావు, గొబ్బూరి**

నన్నయభట్టు విజ్ఞాన నిరతి. రాజమహేంద్రవరం, అద్దేపల్లి అండ్ కో, 1959. 8, 84 పు, 21 సెం మీ. 10

**శాస్త్రి, వి ఆర్**

విచిత్ర ప్రకృతి, విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1959, 186 పు, 19 సెం మీ. 11

**సీతారామచంద్రరావు, బుద్ధిరాజు**

బాల విజ్ఞాన మంజూష, హైద్రాబాదు. సంస్కృతీ నికేతనము, 1953. 169 పు, 19 సెం మీ. 12

# 501 విజ్ఞాన తత్వము

**ది నోయ్, లెకాంటె**

మానవ నియతి. అను: కనకమేడల. మద్రాసు. విజ్ఞానసాహితి, 1957, 264 పు. 19 సెం మీ. 13

భానుమూర్తి, వేమరాజు

విజ్ఞానమంటే ? విజయవాడ, ఆదర్శ గ్రంథ మండలి, 1957. 48 పు, 19 సెం మీ. 14

వెంకటరావు, వసంతరావు

భౌతికాధ్యాత్మిక విజ్ఞానాలు. క్రొవ్వూరు, వల్లూరి సూర్యనారాయణ ధర్మనిధి, 1960. 8, 205 పు. 19 సెం మీ. 15

## 503 విజ్ఞాన నిఘంటువులు, సర్వస్వములు

కాశింఖాన్, మహమ్మద్

బాల విజ్ఞాన సర్వస్వము. తెనాలి, ఓరియంట్ పబ్లిషింగ్ కంపెని, 1955. 296 పు, 23 సెం మీ. 16

జయదేవ్, సి జె సంపా (తదితరులు)

విజ్ఞాన సర్వస్వము. పదవ సంపుటము సాంఘికశాస్త్రము, సంపా: సి జె జయదేవ్, బి కుప్పుస్వామి, కె. ఉమామహేశ్వరరావు మద్రాసు, తెలుగు భాషా సమితి, 1965. 26, 824, 30, 8 పు. 25 సెం మీ. ఇందు మానవశాస్త్రము (ఆంత్రోపాలజీ) కూడా కలదు. 17

బాపినీడు, మాగంటి

ఆంధ్ర సర్వస్వము. రాజమహేంద్రవరం, కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్, 1961 ద్వి ము. 16, 572 పు, 25 సెం మీ. 18

నరసింగరావు, ఆ; తిరువెంకటాచార్య, వి సంపా

విజ్ఞాన సర్వస్వము. తొమ్మిదవ సంపుటము గణిత, ఖగోళ శాస్త్ర ములు. మద్రాసు, తెలుగు భాషాసమితి, 1965. 15, 654, 379 32, 16 పు. 25 సెం మీ. 1,

## వెంకటరంగాచార్యులు, తిరుమల సంపా

పారిభాషిక పద కోశము. మద్రాసు, ఆంధ్ర గ్రంథమాల, 1936, 8, 244 పు, 21 సెం మీ. 20

## వెంకటశివరావు, దిగవల్లి

ఇంగ్లీషు - తెలుగు పారిభాషిక నిఘంటువు, వ్యవహార కోశము - శాస్త్ర పరిభాష. విజయవాడ, రచయిత, 1934 16, 272, 238, 6 పు. 19 సెం మీ. 21

## హరిసర్వోత్తమరావు, గాడిచెర్ల సంపా (తదితరులు)

విజ్ఞాన శాస్త్రము: రెండవ సంపు, భౌతిక రసాయనిక శాస్త్రములు, మొదటి ముద్రణ. సంపాదకులు : గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు, వసంతరావు వెంకటరావు, వేమూరి విశ్వనాథశర్మ, రెండవ ముద్రణ సంపాదకులు: వసంతరావు వెంకటరావు, మేడేపల్లి వరాహ నరసింహస్వామి హైదరాబాదు, తెలుగు భాషా సమితి, 1964, 30, 772, 48, 15. 4 పు. 25 సెం మీ. 22

# 504 విజ్ఞాన వ్యాసములు

## అప్పారావు, విస్సా

వ్యాసావళి, గుంటూరు, రచయిత, 1956 4, 232,4 పు. 19 సెం మీ. 23

## వెంకటరావు, వసంతరావు

విజ్ఞాన సీమలు. రాజమహేంద్రవరం. అద్దేపల్లి అండ్ కో 1959, 60 పు. 17 సెం మీ. 24

# 505 వైజ్ఞానిక పత్రికలు

## ఆధునిక విజ్ఞానం

సంపుటి 1. సంచిక 1. విశాఖపట్నం, ఆగస్టు 1953. 25 సెం మీ, మాసపత్రిక సంపా : వై వి. సోమయాజులు 25

## విజ్ఞానం

సంపుటి 1. సంచిక 1. రాజమహేంద్రవరం, జులై 1937. 25 సెం మీ. ద్వైమాస పత్రిక, సంపా : కాశీపట్నం కొండయ్య. 26

## విజ్ఞాన ప్రపంచం

రాజమండ్రి. 6 మాసముల కొకతూరిప్రచురణ, సంపా : జి వి పంతులు 27

## విజ్ఞాన వాహిని

సంచిక, 1. మదరాసు, తెలుగు భాషా సమితి. 1962. 25 సెం మీ. సంవత్సరానికి నాలుగుసంచికలు. సంపా : డి వి సుబ్బారెడ్డి. 28

## సృష్టి

సంపుటం 1. సంచిక 4. నెల్లూరు, నెల్లూరు సైన్సు సంఘము, మే 1960. 30 సెం మీ. సంపా : శాస్త్రి. 29

# 507. 2 శాస్త్ర పరిశోధన

## జయలక్ష్మి, మ్రే

వైజ్ఞానిక శాస్త్ర పరిశోధనలు, విజయవాడ, కమలా పబ్లికేషన్స్, 32 పు. 19 సెం మీ. 30

## సీతారామయ్య పట్నాయక్, డి

శాస్త్ర పరిశోధనలు, సోంపేట, రచయిత, 1952, .32 పు 14 సెం మీ. 31

# 509 శాస్త్ర చరిత్ర

## వెంకటావధాని, దివాకర్ల

ప్రకృతి విజయము. నెల్లూరు, జయలక్ష్మి అండ్ కో, 1949, 122 పు. 19 సెం మీ. 32

## శ్రీశైలం, పిచ్చుక

భారత, పాశ్చాత్యుల విజ్ఞాన శాస్త్ర విమర్శన. రాజమహేంద్రవరం, తూలిక దేవదాసు, 1954. 8, 142 పు, 21 సెం మీ 33

# 509. 2 శాస్త్ర వేత్తల జీవితాలు

## కమలాకరరావు, కప్పగంతుల

శాస్త్రవేత్తలు. విజయవాడ, వాహినీ ప్రచురణాలయం, 1961, 19 సెం మీ,

మొ భా 40 పు, రెం భా 44 పు.

మూ భా 40 పు, నా భా 42 పు. 34

## నారాయణరావు, వి యస్

ప్రజ్ఞా వంతులు. 35

## ప్యారి, క్యాథరిన్ ఓవెన్సు

ఐన్‌స్టయిన్ జీవితచరిత్ర. అను : బెల్లంకొండ రాఘవరావు. ఏలూరు, గుండిమెడాస్, 1959. 10, 219 పు. 19 సెం మీ. 36

## ఫ్రీమన్, మేబ్లేకర్

అల్బర్ట్ ఐన్‌స్టన్. అను : మహమ్మద్ కాసింఖాన్, రాజమహేంద్రవరం, అద్దేపల్లి అండ్ కో. 1963. 107 పు. 21 సెం మీ. 37

## దక్షిణామూర్తి శాస్త్రి, జె

శాస్త్రవేత్తలు. విజయవాడ, బాలభారతీ ప్రచురణలు, 1960. 44 పు, 17 సెం మీ. 38

## దీక్షితులు, చింతా

విజ్ఞానవేత్తలు. మచిలీపట్నం, త్రివేణీ పబ్లిషర్సు, 1951. 102 పు. 19 సెం మీ. 39

## నారాయణమూర్తి, డి వి యస్

ప్రతిభావంతులు, విశాఖపట్టణం, గుప్తా బ్రదర్సు, 1955. 192 పు, 19 సెం మీ. 40

## బేక్‌హార్డ్, అర్థర్ జె

విద్యుత్ మేధావి టెస్లా. అను: మల్లాది నరసింహశాస్త్రి. రాజమహేంద్రవరం, అద్దేపల్లి అండ్ కో. 1964. 206 పు. 19 సెం మీ. 41

## బోల్టన్, సారా కె

ప్రసిద్ధ విజ్ఞానులు. అను: వేమరాజు భానుమూర్తి. మద్రాసు. ఓరియంట్ లాజ్మన్జ్, 1959. 8, 106, పు, 10 సెం మీ. 42

## రామారావు, బి వి

వైజ్ఞానికుల జీవితములు. హైద్రాబాద్, ఆంధ్రా బుక్ హౌస్, 1953. 111 పు, 19 సెం మీ. 43

## రామనాథం, మండాది

రామన్ మహాశయులు. మద్రాసు, భారతి నుండి పునర్ముద్రితం. విభవ సంవత్సర మాఘ, ఫల్గున, శుక్ల. 30 పు, 25 సెం మీ. 44.

## రామమూర్తి, దివాకర్ల

మనశాస్త్రజ్ఞులు, నెల్లూరు, వల్లమూడి రామయ్య, 1655 128 పు. 19 సెం మీ. 45

## రామారావు, ఎ వి యస్

భారతీయ వైజ్ఞానికులు. కాకినాడ, ఆధునిక విజ్ఞాన గ్రంథమాల. 1957. 51 పు, 19 సెం మీ. 46

శాస్త్ర నిర్మాతలు. కాకినాడ, ఆధునిక విజ్ఞాన గ్రంథమాల, 151 పు. 19 సెం మీ, 47

శాస్త్రవేత్తలు. విజయవాడ, కవితిలక గ్రంథమాల, 1952. 100 పు, 19 సెం మీ. 48

సత్యాన్వేషకులు. కాకినాడ, ఆధునిక విజ్ఞాన గ్రంథమాల, 1958. 100 పు, 19 సెం మీ. 49

## వెంకటసుబ్రమణ్యము, ధూళిపాళ

అన్వేషణ. మద్రాసు, వివేకానంద పబ్లిషర్సు, 1950. 197 పు, 19 సెం మీ. 50

## వెంకటానంద రాఘవరావు, గొబ్బూరి

మహామేధావులు. ఎలమంచిలి, ఆంధ్రావళీ గ్రంథమాలిక, 1935. 122 పు, 17 సెం మీ. 51

## శ్రీనివాసరావు, పసుమర్తి

బెంజిమను ఫ్రాంక్లిను జీవిత చరిత్రము. మద్రాసు, విజ్ఞాన చంద్రికామండలి, 1931. 14, 123 పు, 19 సెం మీ. 52

## సంపత్‌కుమార్, నండూరి

న్యూటన్. విజయవాడ, విద్యార్థి పబ్లికేషన్సు. 44 పు, 19 సెం మీ. 53

## సర్ ఐజక్ న్యూటన్

మద్రాసు, క్రైస్తవ వాఙ్మయ సమాజము, 1931. 28 పు, 19 సెం మీ. 54

## సూర్యప్రకాశరావు, కస్తూరి

విజ్ఞాన భాస్కరులు. మద్రాసు, కల్చరల్ బుక్సు లిమిటెడ్, 1951. 93 పు, 19 సెం మీ. 55

విజ్ఞాన శేఖరులు, మద్రాసు, కల్చరల్ బుక్స్ లిమిటెడ్, 1951. 80 పు, 19 సెం మీ. 56

# 510 గణిత శాస్త్రము

## భాస్కరాచార్య

లీలావతీ గణితము. వ్యాఖ్య : పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రి. పొడగట్లపల్లి, రచయిత, 1936. 8, 13, 544పు. 21 సెం మీ.

## నాగేశ్వరరావు, సూరిశెట్టి

తమాషా యుక్తిలెక్కలు. విజయవాడ, వెంకట్రామ అండ్ కో, 1953. 55 పు. 19 సెం మీ. 58

## మల్లన. పావులూరి

గణితశాస్త్రము. పద్యానువాదము: తడకమళ్ల వెంకట కృష్ణారావు. మద్రాసు, వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, 1863. 59

సారసంగ్రహ గణితము. ప్రథమ భాగము. తిరుపతి, తిరుపతి తిరుమల దేవస్థానము. 1952. 4,120 పు, 21 సెం మీ. 60

## రంగాచార్యుడు, కి

త్రికోణమితి. వాల్తేరు, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, 1945. 314,14 పు, 23.5 సెం మీ. 61

## రామారావు, యు బి

బాల అంకగణితము. ఉడిపి, రచయిత, 1890. 42 పు, 19 సెం మీ. 62

## శేషుబాబు

అవసర గణితము. తెనాలి, సారధి అండ్ కో. 34 పు, 21 సెం మీ. 63

సుబ్బయ్య, కరణము

క్షేత్ర గణితము. పేరేచెర్ల, రచయిత. 15, 126, 34 పు, 19 సెం మీ. 64

## 510.3 గణిత నిఘంటువులు

తిరువెంకటాచార్య, వి

గణిత పారిభాషిక పదములు. రాజమహేంద్రవరం, అద్దేపల్లి అండ్ కో, 1950. 130, 2 పు, 21 సెం మీ. 65

## 520 ఖగోళ శాస్త్రము

ఆర్యభటాచార్యులు

ఆర్యభటీయ వ్యాఖ్య. వ్యా: కొటికలపూడి కోదండరామ సిద్ధాంతి. మద్రాసు, ప్రభుత్వప్రాచ్య లిఖిత పుస్తక భండాగారము. 1956. 29, 220, 8 పు, 23. 5 సెం మీ. 66

కొండయ్య, కాశీపట్నం

విశ్వరూపం. వాల్తేరు, ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు, 1936. 22, 278 పు, 23.5 సెం మీ. 67

భరద్వాజ, రావూరి

వినువీధిలో వింతలు. కర్నూలు, బాలసరస్వతీ బుక్ డిపో. 1964. 452 పు. 19 సెం మీ. 68

జల ప్రళయం. కర్నూలు, బాలసరస్వతీ బుక్ డిపో. 1963. 100 పు, 19 సెం మీ. 69

మసూనా

ఒకే ప్రపంచం. విజయవాడ, జనతా ప్రచురణాలయం, 1964. 40 పు, 19 సెం మీ. 70

నళినీమోహనరావు, మహీధర

ప్రపంచానికి ఆఖరి ఘడియలు. రాజమహేంద్రవరం, అవంతీ ప్రెస్, 1959. 8, 174 పు, 19 సెం మీ. 71

రాజు, సి వి యస్

విశ్వం – విజ్ఞానం. విజయవాడ, విశ్వ భారతీ పబ్లికేషన్స్. 1957. 20 పు, 19 సెం మీ. 72

రాఘవరావు, కె వి

సృష్టి కథ. తెనాలి, ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ, 1954. 210 పు, 20. 5 సెం మీ. 73

రామకృష్ణరావు, చిట్టా

విశ్వకథ. గుత్తి, రచయిత, 1944. 40 పు, 21 సెం మీ. 74

రామారావు, ఎ వి యస్

వినువీధి. కాకినాడ, ఆధునిక విజ్ఞాన గ్రంధమాల, 1955, 332 పు, 19 సెం మీ. 75

విశ్వరహస్యం. కాకినాడ, ఆధునిక విజ్ఞాన గ్రంథమాల. 1965, 65 పు, 10 సెం మీ. 76

వెంకటాద్రి, రావిపూడి

విశ్వాన్వేషణ. తెనాలి, ప్రజాసాహిత్య పరిషత్తు, 1948. 82 పు, 19 సెం మీ. 77

## వెంకటరావు, వసంతరావు

అనంత ప్రకృతి. సికింద్రాబాదు, వెంకటేశ్వర పుస్తకశాల. 1960. 49 పు. 19 సెం మీ. 78

ఆధునిక విజ్ఞానం. విజయనగరం. రచయిత, 1949. 50 పు. 19 సెం మీ. 79

పడకటింట్లో విజ్ఞాన చర్చ. విజయనగరం, రామానుజాచార్య విజ్ఞాన సమితి, 1941. 102 పు. 19 సెం మీ. 80

విజ్ఞాన మంజరి. (గద్య పద్య నాటక సమన్వితం) విజయనగరం, రచయిత, 1965. 120 పు. 19 సెం మీ 81

విజ్ఞాన వికాసం, రాజమహేంద్రవరం. అద్దేపల్లి అండ్ కో, 1951. 72 పు. 19 సెం మీ. 82

విశ్వ రహస్యం. (గేయాలు). విజయనగరం -రచయిత. 1947. 75 పు. 17 సెం మీ. 83

విశ్వ విన్యాసం. (పద్యాలు) రాజమహేంద్రవరం. విశ్వసాహిత్య మాల. 1964. 8, 410 పు. 19 సెం మీ. 84

## శివరిముత్తు, పి

మన ప్రపంచం. అను : కొడవటిగంటి కుటుంబరావు. సికింద్రాబాద్. స్వధర్మ స్వరాజ్య సంఘ, 1964. 85

# 520.1 ప్రాచీన, మాధ్యమిక ఖగోళ శాస్త్రము

## కృష్ణమాచార్యులు, కపిస్థళము

జ్యోతిశ్శాస్త్ర సారము. కాకినాడ, ఆంధ్రసాహిత్య పరిషత్తు, 1917. 88 పు. 19 సెం మీ. 86

వెంకటాచలం, కోట

బ్రహ్మాండ సృష్టివిజ్ఞానము. విజయవాడ, రచయిత, 1949. 168 పు. 21 సెం మీ. 87

వెంకటానంద రాఘవరావు, గొబ్బూరి

జ్యోతిర్వేదం. హైద్రాబాదు, శాస్త్ర విజ్ఞానము, చరిత్ర - తెలుగు ఉర్దూ అకాడమీ, 1960. 277 పు. 19 సెం మీ. 88

నక్షత్రములు, క్రొవ్వూరు. ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలక సంఘము, 1954. 256 పు. 19 సెం మీ. 89

శివరామశాస్త్రి, వేలూరి

ప్రాచీన ఖగోళము. చిరివాడ, రచయిత, 1936. 176 పు, 19 సెం మీ. 90

# 523 వివరణాత్మక ఖగోళ శాస్త్రము

అప్పలస్వామి, పి యస్; మాణిక్యము, జె పి

ఆకాశంలో అద్భుతాలు. అను : (శ్రీమతి) ఎ సి కృష్ణారావు. రాజమహేంద్రవరం, అద్దేపల్లి అండ్ కో. 91

అప్పారావు, విస్సా

ఆకాశం, హైద్రాబాదు, రచయిత, 1960. 72 పు, 21 సెం మీ. 92

వెంకటరావు, వసంతరావు

రోదసీ విజ్ఞానము. మచిలీపట్నం, తెలుగు విద్యార్థి ప్రచురణలు, 1963. 73 పు, 19 సెం మీ. 93

విజ్ఞాన స్రవంతి, రాజమహేంద్రవరం, అద్దేపల్లి అండ్ కో. 1959. 80 పు, 17 సెం మీ. 94

విజ్ఞాన విస్ఫులింగాలు, రాజమహేంద్రవరం, అద్దేపల్లి అండ్ కో, 1959. 100 పుట. 17 సెం మీ. 95

## 523.3 చంద్రుడు

రాధాకృష్ణమూర్తి, గుంటుపల్లి

చందమామ యాత్ర, విజయవాడ, భవానీ పబ్లిషింగ్ హౌస్, 1960. 38 పు. 19 సెం మీ. 96

రెడ్డి, కె యస్

చందమామ, హైదరాబాదు, నాగార్జున ప్రింటింగ్ వర్క్సు. 1962. ద్వి ము 71 పు, 18 సెం మీ. 97

వెంకటరావు, వసంతరావు

చంద్రుని కథ (గేయం). విజయనగరం, రచయిత, 1947. 4, 39 పు. 17 సెం మీ. 98

## 523.4 గ్రహాలు

భరద్వాజ, రావూరి

గ్రహాల గాథలు. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1961. 32 పు, 19 సెం మీ. 99

లెవిన్, బోరిస్

గ్రహాల పుట్టుక, అను : కొడవటిగంటి కుటుంబరావు, విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1958. 72 పుటలు, 19 సెం మీ. 100

వెంకటరావు, వసంతరావు

గాలి గ్రహాలు. విజయనగరం, రచయిత. 1957, 2, 34 పు. 19 సెం మీ. 101

## 523·6 తోకచుక్కలు

### రామారావు, ఎ వి యస్

తోకచుక్కలు. కాకినాడ, మునుగంటి శ్రీరామమూర్తి, 1948.
40 పు, 17 సెం మీ. 102

## 523·7 సూర్యుడు

### మసూనా

సూర్యుని కథ. విజయవాడ, జనతా ప్రచురణాలయం, 1964,
35 పు, 19 సెం మీ. 103

### తంగరాజ్, యం వి

జీవనదాత సూర్యుడు. అను : కొడవటిగంటి కుటుంబరావు.
మద్రాసు, దక్షిణభాషా పుస్తక సంస్థ. 1964. 8,190 పు, 19
సెం మీ. 104

### వెంకటరావు, వసంతరావు

సూర్యుడు. మద్రాసు, ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ, 1948.
80 పు, 19 సెం మీ. 105

### రామారావు, ఎ వి యస్

సూర్యకుటుంబ చరిత్ర. కాకినాడ, ఆధునిక విజ్ఞాన గ్రంథమాల,
1959. 33 పు, 19 సెం మీ. 106

### హేలసి, డి యస్

వింత అగ్నిగోళం. అను : ఎ వి యస్ రామారావు. విజయవాడ,
ఆదర్శ గ్రంథమండలి, 1965. 8,160 పు. 19 సెం మీ. 107

## 523.8 నక్షత్రాలు

భరద్వాజ, రావూరి

నక్షత్రాల చిత్రాలు. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1961. 30 పు, 19 సెం మీ. 108

సంపత్‌కుమార్, నండూరి

నక్షత్రమండలము. ప్రగడవరం, విద్యార్థి ప్రచురణలు. 64 పు, 19 సెం మీ. 109

భానుమూర్తి, వేమరాజు

విశ్వాంతరాళము. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1957. 52 పు. 19 సెం మీ. 110

రాయ్ వ్యాస్, ఎస్ పి

ఆకాశ విజ్ఞానము, తెనాలి, సారథి ప్రచురణలు, 1959, 56 పు, 17 సెం మీ. 111

## 525 భూమి

బాలాజీరావు, ఎస్

భూమి. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి. 1957. 19 సెం మీ. 112

భానుమూర్తి, వేమరాజు

భూమి. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1957. 50 పు. 19 సెం మీ. 113

మసూనా
భూమి కథ. విజయవాడ, జనతా ప్రచురణాలయం, 1964. 34పు, 19 సెం మీ. 114

రమేశ్, కె
భూమి కథ. విజయవాడ, చేతన సాహితి. 30 పు, 19 సెం మీ. 115

సీతారామారావు, ఆవంచ
భూమి - మానవుడు. వికారాబాదు హైదరాబాదు జిల్లా స్థానిక గ్రంథాలయ సంస్థ, 1964. 8, 45 పు, 19 సెం మీ. 116

## 527 అంతరిక్షయానం

గిల్జిన్, కారల్ అలెక్సాండ్రోవిచ్
లోకాంతరయానం. అను: కొడవటిగంటి కుటుంబరావు, విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయము, 1959. 238 పు, 25 సెం మీ. 117

గోపాలకృష్ణమూర్తి, శ్రీపాద
రాకెట్లు - ఆకాశయానము. హైద్రాబాదు, శాస్త్ర విజ్ఞానము, చరిత్ర, తెలుగు - ఉర్దూ అకాడమీ, 1964. 16,186 పు, 19 సెం మీ. 118

పర్వేజ్, ఆధార్
కృత్రిమ చంద్రుని కథ. అను: ఎ వి యస్ రామారావు. కాకినాడ, ఆధునిక విజ్ఞాన గ్రంథమాల, 1964. 56 పు, 19 సెం మీ.

## దొం బ్రోవ్‌స్కి, కె

చందమామకు - రాకెట్లో. అను : వుప్పల లక్ష్మణరావు. మాస్కో, ప్రగతి ప్రచురణాలయం, 1965. 96 పు. 22 సెం మీ. 120

## స్టైరన్‌ఫీల్డ్, ఎ

అంతరిక్షంలో ప్రయాణం. అను : వేమరాజు భానుమూర్తి, విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1957. 108 పు. 19 సెం మీ. 121

## విల్లీ లే

విశ్వాంతరాళంలో రాకెట్లు ఉపగ్రహాలు. అను : రామదాసు. విజయవాడ. దేశి కవితా మండలి, 1961. 152 పు, 19 సెం మీ.

# 530 భౌతిక శాస్త్రము

## కుటుంబరావు కొడవటిగంటి

శాస్త్ర పరిశోధనలు. విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1956. 69 పు, 21 సెం మీ, 123

## చిదంబరరావు, జి వి; నారాయణ, పి వి

భౌతిక విజ్ఞానము - ద్రవ్య విజ్ఞానము. విజయవాడ, వెంకట్రామా అండ్ కో. 1958. 15,204 పు. 19 సెం మీ. 124

## నరసింహం, మయినంపాటి

భౌతిక శాస్త్రము. మద్రాసు, విజ్ఞాన చంద్రికా మండలి, 1911. 38,386,6 పు. 19 సెం మీ. 125

## ప్రసాదమూర్తి, యస్ యస్

సామాన్య విజ్ఞాన శాస్త్రము. తెనాలి, వివేకానంద పబ్లికేషన్స్. 1958. 4,108 పు. 21 సెం మీ. 126

## వెంకటరావు, వసంతరావు

ద్రవ్యము - శక్తి. విజయనగరం, రచయిత. 14 సెం మీ. మొ భా 1942. రెం భా 1943. మొత్తం 220 పు. 127

మారేలోకం. ఏలూరు. ప్రతిమా బుక్స్, 1946 115 పు. 17 సెం మీ. 128

## సీతారామయ్య, కె

భౌతికశాస్త్ర ప్రథమ పాఠాలు. మద్రాసు, విజ్ఞాన చంద్రికా మండలి, 1914. 8,172 పు. 19 సెం మీ. 129

## సీతారామయ్య, పెండ్యాల

విజ్ఞాన జగతి. 40 పు. 19 సెం మీ. 130

## సీతారామారావు, ఆవంచ

పని శక్తి. వికారాబాదు, హైద్రాబాదు జిల్లా స్థానిక గ్రంథాలయ సంస్థ, 1964. 8,30 పు, 19 సెం మీ. 131

# 530.3 భౌతిక శాస్త్ర నిఘంటువులు

## బాలంకేశ్వరరావు, ఎ

పదార్థ విజ్ఞానశాస్త్ర పారిభాషిక పద నిఘంటువు. వాల్తేరు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, 1938, 102 పు, 23 సెం మీ. 132

## 531·3 గతి శాస్త్రము

వెంకట్రామయ్య, పింగళి

గతి శాస్త్రము (డైనమిక్సు). అనంతపురం. ప్రభుత్వ కళాశాల. 62, 8 పు. 25 సెం మీ. 133

## 534 ధ్వని

కుంద్ర్యావ్ త్సెవ్, బి

మనకు వినపడని ధ్వనులు. అను: వుప్పల లక్ష్మణరావు. మాస్కో, విదేశ ప్రచురణాలయం, 160 పు, 19 సెం మీ. 134

భానుమూర్తి, వేమరాజు

శబ్ద ప్రపంచం. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1963, 148 పు, 19 సెం మీ. 135

## 635 వెలుగు

ఇలిన్

కారుచీకటి, కాంతిరేఖ. అను: చంద్రం. హైదరాబాదు, ప్రజా ప్రచురణాలయం, 1945, 4, 72 పు, 19 సెం మీ. 136

భానుమూర్తి, వేమరాజు

వెలుగు. హైదరాబాదు, శాస్త్రవిజ్ఞానము చరిత్ర, తెలుగు- ఉర్దూ అకాడమీ. 19 సెం మీ. 137

మసూనా

వేడీ వెలుగు కథ. విజయవాడ, జనతా ప్రచురణాలయం, 1964. 55 పు. 19 సెం మీ. 138

## 537 విద్యుచ్ఛక్తి

### జూలియన్ రెడ్డి, ఓ కె

విద్యుశ్ఛక్తి, అయస్కాంతము. రాజమహేంద్రవరం, శ్రీనివాస్ పబ్లిషింగ్ హౌస్, 1957. 8, 194 పు. 19 సెం మీ. 139

### భానుమూర్తి, వేమరాజు

విద్యుచ్ఛక్తి. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1957. 78 పు. 19 సెం మీ. 140

### నారాయణమూర్తి, గుళ్ళపల్లి

విద్యుచ్ఛక్తి - నిస్తంత్రీ యోగము. అనకాపల్లి, రచయిత, 1940. 8,222, 32 పు. 19 సెం మీ. 141

### వెంకటరావు, వసంతరావు

విద్యుద్విలాసం. రాజమహేంద్రవరం, అద్దేపల్లి అండ్ కో, 1963. 105 పు. 19 సెం మీ. 142

### వెంకట లక్ష్మణరావు, వి

విద్యుచ్ఛక్తి, మన నిత్య జీవితాలు. మద్రాసు, దక్షిణ భాషా పుస్తక సంస్థ, 1965. 157,16 పు. 19 సెం మీ. 143

### సూర్యనారాయణ శర్మ, గాడేపల్లి

ఎలక్ట్రిసిటీ - విచిత్ర ప్రక్రియలు. విజయవాడ, వెంకట్రామా అండ్ కో, 1939, 214 పు. 19 సెం మీ. 144

## 538 అయస్కాంత శక్తి

### భానుమూర్తి, వేమరాజు

అయస్కాంతం కథ. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1956. 45 పు. 19 సెం మీ. 145

## 539 ఆధునిక భౌతిక శాస్త్రము

### అనంత అచ్యుత సత్యనారాయణరావు, దువ్వూరి

పరమాణువు. విశాఖపట్నం, యం యస్ అర్ మూర్తి అండ్ కో., 1951. 145 పు, 21 సెం మీ, 146

### అప్పారావు, విస్సా

పరమాణుశక్తి. రాజమహేంద్రవరం, రచయిత, 1952. 224 పు, 19 సెం మీ. 147

### కూజిక్, ఎ యమ్

అణుబాంబు వెలుడు ప్రపంచవ్యాపిత ప్రమాదం. అను : గిడుతూరి సూర్యం, మాస్కో, విదేశీ భాషా ప్రచురణలు. 105 పు, 19 సెం మీ. 148

### కుటుంబరావు, కొడవటిగంటి

అణుశక్తి మానవ కల్యాణానికా? మారణహోమానికా ?, విజయవాడ, ఆంధ్రరాష్ట్ర శాంతి సంఘం. 35 పు. 19 సెం మీ. 149

పదార్థంలో పరమాణువులు. మద్రాసు, వరూధినీ గ్రంథమాల. 1959. 95 పు. 19 సెం మీ. 150

### గోపాలకృష్ణమూర్తి, శ్రీపాద

అయిన్‌స్టన్ సాపేక్షతా వాదము, కొవ్వూరు, వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారి ధర్మనిధి, 1963. 8,187 పు. 19 సెం మీ, 151

### డన్ లాప్ హెన్రీ, ఏ; టచ్ హాన్స్, యస్

మీ సేవలో పరమాణువులు. అను : మల్లాది నరసింహశాస్త్రి. సికింద్రాబాదు, యం శేషాచలం అండ్ కం. 1962. 8,187 పు. 21 సెం మీ. 152

యివాన్సు డక్, గార్డన్

అణుశక్తి. అను : యన్ ఆర్ చందూర్. మద్రాసు, ప్రతిమా బుక్సు, 1962 ద్వి ము. 127 పు, 19 సెం మీ. 153

భానుమూర్తి. వేమరాజు

అణువులు - పరమాణువులు. విజయవాడ, ఆదర్శ గ్రంధమండలి, 1956. 79 పు. 19 సెం మీ. 154

రస్సెల్, బర్ట్రెండ్

అణుయుగంలో ప్రపంచశాంతి. అను : వి నారాయణరావు. మచిలీపట్నం, యం శేషాచలం అండ్ కం, 1960. 8,100 పు, 19 సెం మీ. 155

రామారావు, ఏ వి యస్

పరమాణువు కథ. కాకినాడ, ఆధునిక విజ్ఞాన గ్రంథమాల, 1963. 63 పు, 19 సెం మీ. 156

వెంకట కృష్ణమూర్తి. గంటసాల

ఆటంబాంబు. విజయవాడ, వెంకట్రామా అండ్ కో. 1952. 24 పు. 19 సెం మీ. 157

వెంకటరావు, వసంతరావు

ఎలక్ట్రాను (ఆత్మకథ). హైద్రాబాదు, సంస్కృతీ నికేతన్, 1953. 98 పు, 19 సెం మీ. 158

వెంకట సుబ్బారావు, కొమరవోలు

పరమాణు గాథ. సికింద్రాబాదు, వెంకట్రామా అండ్ కో, 1950. 500 పు. 19 సెం మీ. 159

సెలిగ్ హెకెట్, రాబినో విచ్ యూ

పరమాణువు దాని కథ. అను : మల్లాది నరసింహశాస్త్రి. విజయవాడ, దేశి కవితా మండలి, 1953. 33 పు, 20 సెం మీ. 160

హైజన్‌బర్గు, డబ్ల్యూ

పరమాణు కేంద్రపు భౌతిక శాస్త్రాంశములు. అను : గొబ్బూరి వెంకట రఘునాధ కృష్ణరావు. మద్రాసు, మద్రాసు విశ్వవిద్యాలయము, 1964. 15,358 పు, 23 సెం మీ. 161

హైడ్ మార్గరేట్, ఓ

అణువులు నేడు రేపూను. అను : శ్రీపాద గోపాలకృష్ణమూర్తి. గుంటూరు, మారుతీ బుక్ డిపో, 1965. 8,147 పు, 19 సెం మీ.

# 540 రసాయనిక శాస్త్రము

చిదంబరరావు, జి వి; నారాయణరావు, పి వి

భౌతిక విజ్ఞానము - రసాయనిక విజ్ఞానము. విజయవాడ, వెంకట్రామా అండ్ కో, 1958 15,142 పు, 19 సెం మీ 163

భరద్వాజ, రావూరి

రంగుల కథ. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1961. 28 పు, 19 సెం మీ. 164

భానుమూర్తి, వేమరాజు

పైన్సు కథ. హైద్రాబాదు, ఆంధ్ర సారస్వత పరిషత్, 1951. 380 పు, 21 సెం మీ. 165

విశ్వనాధశర్మ, వేమూరి

రసాయన శాస్త్రము. మద్రాసు, విజ్ఞాన చంద్రికా మండలి, 1910. 26,291 పు, 19 సెం మీ. 166

# 550 భూగర్భ శాస్త్రము

## కృష్ణన్, యం యస్

ఖండ గమనము. అను : యస్ నవీనచంద్ర. హైద్రాబాదు, శాస్త్ర విజ్ఞానము, చరిత్ర తెలుగు – ఉర్దూ అకాడమీ, 1964. 16,99,22 పు. 19 సెం మీ. 167

## బాలకృష్ణ, సూరి

భూమి. హైద్రాబాదు, శాస్త్ర విజ్ఞానము, చరిత్ర తెలుగు – ఉర్దూ అకాడమీ, 1960. 8, 48 పు 19 సెంమీ. 168

# 551 భూగర్భ భౌతిక శాస్త్రము

## ఉదయమూర్తి, ఎమ్ ఎస్

ఎల్లలెరుగని కడలి. అను : కొడవటిగంటి కుటుంబరావు. మద్రాసు, దక్షిణ భాషా పుస్తక సంస్థ, 1964. 8,116 పుట, 19 సెం మీ. 169

## భానుమూర్తి, వేమరాజు

కడలి కథ. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1951. 86 పు. 19 సెం మీ. 170

## సంపత్‌కుమార్, నండూరి

మహా సముద్రములు, విజయవాడ, విద్యార్థి ప్రచురణలు. 51 పు, 19 సెం మీ. 171

## వరాహమిహిరాచార్య

జలార్గళ శాస్త్రము. మద్రాసు, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు. 1928. 458 పు. 19 సెం మీ. 172

## వాసుదేవశాస్త్రి, గొల్లాపిన్ని

భూగర్భ జలజ్ఞాన శాస్త్రము. అను : మద్రాసు, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు. 1954. 28 పు, 16 సెం మీ. 173

## హాయకావా, మాసామి

అగ్ని పర్వతములు. అను : నవీనచంద్ర, హైద్రాబాదు. శాస్త్ర విజ్ఞానము, చరిత్ర తెలుగు - ఉర్దూ అకాడమీ, 1961. 8,66 పు. 19 సెం మీ. 174

# 551·5 వాతావరణము

## గ్రామస్థుల పంచాంగము

1926 - 27. మద్రాసు, మద్రాసు ప్రభుత్వ వ్యవసాయశాఖ, 23 సెం మీ. 175

గమనిక : నేడు దీనిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ వ్యవసాయ శాఖ ప్రచురిస్తున్నది.

## భానుమూర్తి, వేమరాజు

వాతావరణం. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1957. 60 పు, 19 సెం మీ. 176

## పుష్పబంధము అను వర్షప్రదీపిక

మద్రాసు, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, 1926. 44 పు. 21 సెం మీ. 177

## రెడ్డి, కె యస్

ఉరుములు - మెరుపులు. విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1965. 43 పు, 19 సెం మీ. 178

## వెంకట్రాయ శర్మ సిద్ధాంతి, నీలంరాజు

వర్షాకాల ప్రదర్శిని. మద్రాసు, రచయిత, 1962. 24 పు, 19 సెం మీ. 179

## దొరస్వామి అయ్యంగారు, పి

షష్టి వత్సర దృగ్గణిత పంచాంగములు. 1867 - 68 సం మొదలు 1926 - 27 సం వరకు మద్రాసు, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, 1930. 50,742 పు, 25 సెం మీ. 180

## విజయరామయ్య, ఉప్పలంరాజు

వాతావరణ మార్పులు. గుడివాడ, రచయిత, 1957. 16 పు. 19 సెం మీ. 181

## సాయిరెడ్డి, గంగుల

వర్షయోగం. జీడికల్లు, రామా పబ్లికేషన్స్, 1960. 8,80 పు. 19 సెం మీ. 182

# 553.2 ఆయిలు, బొగ్గు

## నరసింహారాయుడు, వి

నేలబొగ్గు. కాకినాడ, సుజనరంజని ప్రెస్, 1900. 21 పు, 21 సెం మీ. 182 A

## వెంకటకృష్ణమూర్తి, గంటసాల

నూనె - పెట్రోలు. విజయవాడ, వెంకట్రామా అండ్ కో, 1952. 32 పు, 19 సెం మీ. 183

## శ్రీవాత్సవ

ఆయిలు. విజయవాడ, కమలా పబ్లికేషన్సు, 1965. 24 పు, 19 సెం మీ. 184

## 553.3 రత్నములు

నవరత్న దీపిక

96 పు, 19 సెం మీ. 185

భైరవకవి

రత్న పరీక్ష. మద్రాసు, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, 1920. 39 పు, 17 సెం మీ. 186

లీలావతీదేవి, దంతుర్తి

నవరత్నాలు. తెనాలి, సర్వోత్తమ ప్రచురణలు, 1961. 8,78 పు. 19 సెం మీ. 187

## 570 మానవ, జీవ శాస్త్రములు

కుటుంబరావు, కొడవటిగంటి

ప్రాణులు ప్రపంచం. విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1955. 111 పు, 19 సెం మీ. 188

ప్యాస్, యఫ్ జి

నేటి మానవుని కృషి. అను: చింతా దీక్షితులు. మద్రాసు, జెఫ్రి కంబర్లేజ్ - ఆక్స్ఫర్డు యూనివర్సిటీ, 1947. 218 పు, 19 సెం మీ. 189

భానుమూర్తి, వేమరాజు

ప్రాణికోటి. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1959. 74 పు, 19 సెం మీ. 190

### భాస్కర రామమూర్తి, ఓలేటి

ప్రాణికోటి. పిఠాపురం. రచయిత, 1915. 8,26 పుట, 19 సెం మీ, 191

### మసూనా

సృష్టిలో చిత్రాలు. విజయవాడ, జనతా ప్రచురణాలయం, 1964. 46 పు. 19 సెం మీ. 192

### రత్నము, హెచ్ ఎ

ప్రాణికోటి - మానవ సౌఖ్యము. మద్రాసు, 1942. 6,152 పు. 19 సెం మీ. 193

### వెంకటరావు, వసంతరావు

మానవా, మానవా? (గేయాలు), విజయనగరం, రచయిత, 1951. 4,34 పు, 17 సెం మీ. 194

## 572 మానవశాస్త్రము

### ఇలిన్, యమ్; సెగాల్, యమ్

జనులు - మహాజనులు. అను : మహీధర జగన్మోహనరావు. రాజమహేంద్రవరం, విశ్వసాహిత్యమాల, 1965 ద్వి ము. 540 పు. 19 సెం మీ. 195

మానవులు - మహీధరములు. అను : మహీధర జగన్మోహన రావు. రాజమహేంద్రవరం, విశ్వసాహితీమాల, 1958 ద్వి ము. 540 పు, 19 సెం మీ. 196

ఏంజల్సు, ఫ్రెడరిక్

వానరుడు - నరుడు. అను : మహీధర జగన్మోహనరావు. రాజమహేంద్రవరం, విశ్వసాహిత్యమాల. 56 పు, 19 సెం మీ.

గోల్డ్‌మాన్ ఇర్వింగ్; గోల్డ్‌మాన్, హన్నా

తొలి మానవులు, అను : వేమరాజు భానుమూర్తి. విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1958. 241 పు, 19 సెం మీ.

నాగభూషణాచార్యులు, చిర్రావూరి

ఆదిమవాసులు. తెనాలి, సుందరాం అండ్ సన్సు, 1948. 16,190 పు. 19 సెం మీ. 199

భరద్వాజ, రావూరి

మనిషి కథ. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1962. 42 పు. 19 సెం మీ. 200

భానుమూర్తి, వేమరాజు

మానవుడు. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1958. 22 పు, 19 సెం మీ. 201

మసూనా

మానవుని కథ, విజయవాడ, జనతా ప్రచురణాలయం, 1964. 44 పు, 19 సెం మీ. 202

రాఘవయ్య, వెన్నెలకంటి

చెంచువారు. నెల్లూరు, రచయిత, 8.140 పు, 19 సెం మీ. 203

రామానుజరావు, దేవులపల్లి

ఆదిమ నివాసులు, హైద్రాబాదు, జనార్ధన పబ్లికేషన్సు, 1947. 36 పు, 19 సెం మీ. 204

వెంకటశివరావు, దిగవల్లి

ఆదివాసులు యుద్ధముల, విజయవాడ, నవోదయ పబ్లిషర్సు, 1958. 96 పు, 19 సెం మీ. 205

సోమసుందరం, ఎ ఎం

మానవశాస్త్రము. విజయవాడ, ప్రజాశక్తి కార్యాలయం, 1945. 8,206,4 పు, 19 సెం మీ. 206

## 574 జీవశాస్త్రము

చేంబర్సు, రాబర్టు వార్నర్; స్మిత్ అల్మాస్మిత్ పేన్

జీవకణ పరిశీలన. అను : గాలి బాలసుందరరావు. ఏలూరు, ప్రజా ప్రచురణలు, 1965. 288 పు, 19 సెం మీ. 207

ఫాల్బ్, పీటర్

నవీన భూ ప్రపంచం. ఏలూరు, ప్రజా ప్రచురణలు. 1965. 304 పు, 19 సెం మీ. 208

భానుమూర్తి, వేమరాజు

జీవ వికాసము. హైద్రాబాదు, సంస్కృతీ నికేతనం, 1963. 100 పు, 19 సెం మీ. 209

మృత్యురహస్యం, విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1963. 163 పు, 19 సెం మీ. 210

సుందరప్రకృతి. విజయవాడ, ఆదర్శ గ్రంథమండలి, 1957. 56 పు, 19 సెం మీ. 211

## భువనేశ్వరి, కె (తదితరులు)

జీవోత్పత్తి వికాసం. కె భువనేశ్వరి. ఎమ్ లక్ష్మణరావు, ఆర్ ఆండాళ్, డి సుబ్రహ్మణ్యం. అను : ఐ సాంబయ్య, వి కృష్ణమాచార్య. తెనాలి, సాహితీ కేంద్రం, 1962. 19 సెం మీ. 212

## రాజశేఖరరావు, దుగ్గిరాల

మృత్యుధూళి. ఏలూరు, రచయిత, 1958. 47 పు, 19 సెం మీ.

## లక్ష్మీపతి, ఆచంట

జీవశాస్త్ర సంగ్రహము. 214

## వెంకటరావు, వసంతరావు

జగత్తు-జీవము. విజయనగరము, రచయిత, 1949. 64 పు, 19 సెం మీ. 215

## సత్యనారాయణ, అద్దేపల్లి

మానవుడు, గుంటూరు, వ్యాయామకళా పవర్ప్రెస్, 4,46 పు, 24.5 సెం మీ. 216

## హేమ్మింగ్, జేమ్సు

మారకములపై మానవుని విజయయాత్ర. అను : డి వి రంగాచార్యులు. మద్రాసు, ఓరియంట్ లాజ్మన్స్, 1963. 8,194, పు, 19 సెం మీ. 217

# 575 జీవ పరిణామము

## జగన్నాథస్వామి, పారనంది

మనశ్శరీరములపై పరిసరముల ప్రభావము. మద్రాసు. ఆంధ్ర పత్రిక కార్యాలయము, 1918. 8,111 పు. 21 సెం మీ. 218

## జయలక్ష్మి, మద్రే

ప్రాణులు - ప్రకృతి జీవనము. విజయవాడ, కమలా పబ్లికేషన్స్. 33 పు. 19 సెం మీ. 219

## దీక్షితులు, చింతా

పరిణామ వాదము - తన్నిదర్శనము. తెనాలి సాహితీ సమితి, 112 పు, 19 సెం మీ. 220

## నోవికోవ్, ఎ

మానవ వంశవృక్షము. అను : కొడవటిగంటి కుటుంబరావు. విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం. 1955. 79 పు. 21 సెం మీ. 221

## వాసుదేవరావు, చలసాని

పరిణామ వాదము. విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1956. 68 పు. 19 సెం మీ. 222

## వెంకటప్పయ్య పంతులు, కొండా

సృష్టి విచారము. క్రొవ్వూరు. ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ పాలక సంఘము, 1951, 16, 194 పు. 19 సెం మీ. 223

వెంకటేశ్వరరావు, త్రిపురనేని

అభ్యుదయము (పద్యకావ్యము). గుడివాడ, కవిరాజ చికిత్సాలయం 1956 ద్వి ము. 30 పు, 19 సెం మీ. 224

శాస్త్రి, వి ఆర్

నీవు - నీ పరిణామము. విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయం, 1956. 68 పు, 19 సెం మీ. 225

## 580 వృక్షశాస్త్రము

మాణిక్య వరాహ నరసింహమూర్తి, పాలకూరి

ప్రకృతి. కాకినాడ, రచయిత, 1948. 62 పు, 19 సెం మీ. 226

నారాయణమూర్తి, తెంపల్లి

వృక్షశాస్త్రము. కానూరు, తెంపల్లి వెంకట భైరవమూర్తి, 1913. 76 పు, 19 సెం మీ. 227

నారాయణమూర్తి, సి

వృక్షశాస్త్రము. 1913. 228

రంగాచార్యులు, కె; సూర్యనారాయణ, కె

వృక్షశాస్త్రము. మద్రాసు, మాక్మిలన్ అండ్ కో. 229

రంగాచార్యులు, కె

ఔషధి శాస్త్రము. మద్రాసు, మాక్మిలన్ అండ్ కో, 1917. 16,322 పు, 19 సెం మీ. 230

